ఓమ్.

బాలా పరమేశ్వరీ దేవ్యైనమః॥

# నీలకంఠేశ్వర శతకము.

—♦ ఇయ్యది ♦—

తూర్పు గోదావరి జిల్లా, రాజోలు తాలూకా,

పుల్లేటికుర్రు వాస్తవ్యుఁడును దివ్యాంగ

శ్రీ బళ్ల శనకయ్యగారి

ప్రథమ పుత్రుఁడును నగు

మల్లయ్యచే రచియింపఁబడి,

దివ్యాంగ శ్రీచింతా వీరభద్రయ్య కవిగారిచేఁ

బరిష్కరింపఁబడి

దగ్గులూరి నివాసులగు మ॥ రా॥ శ్రీ

విశ్వనాథం కోటయ్య, సోమన బసవరాజు

గార్ల ప్రోత్సాహంబున, సజ్జనుల

ద్రవ్య సహాయంబుచే,

పాలకొల్లు రామకృష్ణా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి

ప్రకటింపఁ బడినది.

మొదటి కూర్పు 1000 ప్రతులు.

**1936.**

రిజిష్టర్డు కాపీరైటు. [వెల **0-2-0.**

ఓమ్.

శ్రీ బాలా పరమేశ్వరీ దేవ్యై నమః॥

# నీలకంఠేశ్వర శతకము.

—♦ ఇయ్యది ♦—

తూర్పు గోదావరి జిల్లా, రాజోలు తాలూకా,
పుల్లేటికుర్రు వాస్తవ్యుఁడును దివ్యాంగ
శ్రీ బళ్ల కనకయ్యగారి
ప్రథమ పుత్రుఁడును నగు
మల్లయ్యచేఁ రచియింపఁబడి,
దివ్యాంగ శ్రీ చింతా వీరభద్రయ్య కవిగారిచేఁ
పరిష్కరింపఁబడి

దగ్గులూరి నివాసులగు మ॥ రా॥ శ్రీ
విశ్వనాథం కోటయ్య, సోమన బసవరాజు
గార్ల ప్రోత్సాహంబున, సజ్జనుల
ద్రవ్య సహాయంబుచే,
పాలకొల్లు రాజరత్న ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడి
ప్రకటింపఁబడినది.
మొదటి కూర్పు 1000 ప్రతులు.

**1936.**

 [వెల **0-2-0.**

## ఈ గ్రంథ ముద్రణ ధన సహాయుల పేర్లు.



### దగ్గులూరు.

మ॥ రా॥ శ్రీ ధాట్ల ఆనందరాజుగారు.
... సామంతపూడి సీతారామరాజుగారు.
... విశ్వనాథం కోటయ్యగారు.
... సోమన బసవరాజుగారు.
... వాసా వీరభద్రుడుగారు.
... సోమన వీరన్నగారు.
.... విశ్వనాథం సోమలింగంగారు.
.... సిద్దాని కోటయ్యగారు.
.... తమ్మా తాతయ్యగారు.
.... ఎన్నా నారాయణుడుగారు.
.... అందే కోటయ్యగారు.
.... సమతం లింగయ్యగారు.

### భగ్గేశ్వరం.

.... తాళ్ల లింగమూర్తిగారు
.... యీ సోమలింగంగారు.
.... యీ చిట్టి వీరన్నగారు.
.... యీ మారెయ్యగారు.
.... యీ తాతన్నగారు.
.... గుమ్మడి శేషయ్యగారు.
.... తాళ్ల భోగయ్యగారు.
.... చల్లా వీరబసవయ్యగారు.

సీ॥ శ్రీనిలయంబునై ♦ చెన్నూరు వర దగ్గు

లూరి వాస్తవ్యుండు ♦ దార గుణుఁడు

సామంత పూర్వాంశ ♦ సాగర చంద్రుండు

పెద వేంకట నృపాలు ♦ బ్రియ సుతుండు

పావన చారిత్రి ♦ బంగారయాంబ స

ద్గర్భ సుశుక్తి ♦ ము ♦ క్తా ఫలంబు

నిరతాంబు జాక్షాంఘ్రి ♦ నీరేజ సేవా ప

రాయణ స్వాంతుండు ♦ రమ్య యశుఁడు

గీ॥ సత్యనారాయణాహ్వయ ♦ క్షత్రియుండు

మిత్ర వాత్సల్యమూని ♦ పవిత్రి భావ

మున మదీయాకృతి పట ము ♦ ద్రణ ధనంబుఁ

బ్రీతిఁగో నిడె సిలఁదన ♦ ఖ్యాతి వెలయ

ఇట్లు,

గ్రంథకర్త.

# పీ ఠి క.



సదయ హృదయులగు చదువరుల కొఱక విజ్ఞప్తి.

నేనప్పుడప్పుడు భక్తిదాయక గ్రంథములఁ జదువుచుండుటచే నుదయించిన యానందమునఁ గొన్నికొన్ని పద్యములను దీరికగల సమయంబుల రచించుచుండ నవి తిలకించి మన్మిత్రులును, దగ్గులూరి వాస్తవ్యులును, కర్ణోద్భవ వంశీయులును నగు మ॥రా॥శ్రీ వాసా సూర్యసోమలింగముగారు ఏతద్గ్రామ పాలకుఁడగు నీలంకశేశ్వరస్వామివారిపై శతకమొకటి రచియింపుఁడనిపలుమాఱు నన్నుఁ బ్రోత్సహించి నందునఁ గించిజ్ఞుండనైనను భాగవదాంకితమును, భక్తిజ్ఞాన ప్రబోధితంబును నగు గ్రంథమగుటచే సాహసించి యీ చిన్ని పొత్తమును రచియించి, మోరిగ్రామ వాస్తవ్యులును, చంద్రికాంతాద్యనేక గ్రంథ నిర్మాతలును, దిగంత యశో విశాలురును, మద్గురువరేణ్యులును నగు శ్రీచింతా వీరభద్రయ్య కవిగారికిఁజూపింప, శ్రమయని యెంచక తప్పులను సవరించి యచ్చొత్తించుట కనువగునటుల శుద్ధప్రతినిఁదయారుచేసి యిచ్చినందులకు వారికనేక హృదయపూర్వకాభివందనంబు లాచరించుచున్నాఁడను. గుణ గ్రహణ పారీణులగు విద్వజ్జన శిఖామణులిందుఁగల తప్పుల నిరసించి యొప్పులనేఁ బరిగ్రహింతురని పరిపరి విధములఁ బ్రార్థించుచున్నాఁడను.

ఇట్లు విద్వజ్జన విధేయుఁడు,

గ్రంథకర్త.

# పండితాభిప్రాయములు.

శ్రీబాలా పరమేశ్వరీ దైవోపాసకుండగు ఈకవి, కవితారస ప్రవాహ మనుపమాన లలిత మృదు మధుర పద గుంఫనోపేతమై, పురాతన ప్రౌఢ కవి తల్లజుల వాగ్ఝరీ సదృశమై విరాజిల్లు చున్నదన్న నుడియందిసు మంతయు నతిశయోక్తి గానంబడదు.

పర శివభక్త జనబృంద పదారవింద భజనాసక్తుం డును, సత్కవి కృపాపాత్రుండును నగు బళ్ల మల్లయా హ్వయ కవిచే రచియింపఁ బడిన, యీ నీల కంఠేశ్వర శతకము, సకలజన పఠనార్హంబై, యాచంద్ర తారార్క మై, యఖిల భారతావని నలరారునని మదీయాశయము.

ఈ కృతి భర్తయగు నీలకంఠేశ్వరుఁడు, యీబాల కవిని పూర్ణాయురారోగ్యా ద్యఖిల భాగ్యభోగ్య సంక లితునిఁగా నొనర్చి, నిరుపమాన శేముషీ ధురంధరునిఁగా జేసి, యితోధిక కవితాభ్యుదయం బొసంగి, నిరంతరమాం ధ్రభాషా విదుషీపద సేవా పరతంత్రునిఁగాఁ జేయుఁగాత.

| | |
|---|---|
| పెన్నాడ అగ్రహారము. | ఇట్లు విద్వజ్జన విధేయుఁడు, మంగిపూడి వీరయ్య సిద్ధాంతి. |

2. ఈ కవిచే వ్రాయబడిన శతక మత్యంత సరస మృదు పద భూయిష్ఠమై పూర్వకవుల ననుసరించిన నీతి భక్తి రస ముల్లసితమై సకల సుధీజన చిత్తరంజితమై శబ్దా లంకార శోభితమై యలరారు చున్నది. ఇట్టి కవితల నెల్లరింకను ప్రోత్సహించి యాంధ్ర భాషామతల్లి నభివృద్ధి జెందించ కోరుచున్నాను.

ఇట్లు,

ధర్మపురి తిరుమల లక్ష్మీకుమార వేదాన్త తిరుమలాచార్యులు, ఉభయభాషా ప్రవీణ, పాలకొల్లు.

3. శ్రీ పరమేశ్వర చరణ సేవా ధురీణుండగు, బళ్ల మల్లయ్య కవి గారిచే రచింపఁబడిన, యీ నీలకంఠేశ్వర శతకము సమగ్రంబుగఁ బరిశీలించితిని. ఇందులో నవిస్పష్టానర్థకంబులులేక, సువచనాను గమ్యమై, సుధారసంబులుప్పతిల్లు మృదూక్తులుం గలిగి, విరాజిల్లు చున్నది. ఇక్కవి, పదగుంభన రసవిశేష పోషణంబులు, ప్రాచీన కవి పుంగవులం బోలి, ప్రౌఢతరమై, యత్యాదరంబున ముత్యంబులఁ గూర్చిన గుత్తులవలె, గంగాల హారులో యన్నట్లుఁ గన్పట్టుచుఁ బండిత బృందంబుల హృదయారవిందంబులకమితానందంబుఁగొల్పుచున్నయది ఈశతకంబు నీతిదాయకంబై, యుక్తియుక్త ప్రబోధితంబై, సకలమానవకోటి హృదయ రంజకంబై, స్మరణానుకూలమై, భక్తి ముక్తులఁ గలుగఁ జేయు ననుట కిసుమంతయును, సందియము లేదని నా పూర్ణాభిప్రాయము.

ఉ॥ ఈ కవికిన్ మహాత్ముఁడు మ ♦ హేశుఁడు, వాణిధవుండు, విష్ణుఫ్రుల్,
నాకము నేలునేతి ఁరి, ♦ నాయువు, సంపద, భోగముల్ సదా
లోకములోన సత్కృపను ♦ లోపము లేక నొసంగి యెప్పుడున్
సాకుచు నుండు గాత గుణ ♦ సత్త్వము, పండిత, మల్లయాహ్వయున్

ఇట్లు విద్వజ్జన విధేయుఁడు,
పూడి భోగలింగ కవి, దగ్గులూరు.

తాము రచియించిన నీలకంఠేశ్వర శతకము నా మూలాగ్రముగా జదివితిని, యిది భక్తి నీతిదాయకంబై, పండిత పామర జనాహ్లాద కరంబై, తేనెలొలుకు మృదు పద భూయిష్టంబై, ప్రాచీన కవిపుంగవుల పోకడగల్దై, అనర్గళధారా ప్రవాహంబై దనరారుచున్నది. ఇంకను యిట్టి గ్రంథములు రచియించుట కాంధ్రభాషాభిమాను లందరు మీకుఁదగిన ప్రోత్సాహము గలిగించెదరని నా ముఖ్యాభిప్రాయము.

ఈకవి వర్యునకు శ్రీనీలకంఠేశ్వరుండనిశము నా యురారోగ్యైశ్వర్యము లొసంగి రక్షించుగాక!

తే॥ గీ॥ మృదుపద విరాజితంబయి ♦ చదువరులకు
నర్థ కాఠిన్యమును లేక ♦ నధిక భక్తి
యుక్తమై, సర్వపాప వి ♦ ముక్తియగుచు
మహిని మీ శతకముఁ గ్రాలె ♦ మల్లయార్య

ఇట్లు బుధజన విధేయుఁడు,

కడియం తమ్మన్న కవి, పాలకొల్లు.

ఉ॥ భూరి కవీశ! కోవిదుల ♦ బుద్ధికి గోస్తని పాకమట్లు శం
య్యారు చిరోక్తులం బరపి ♦ యాంధ్రమునన్ దగు సీస పద్యముల్
కోరినవారి కోర్కెలు న♦కుంఠిత రీతినొసంగునట్లు నాఁ
తార సుధాకరార్కముగ ♦ దైవము కర్పణ జేసి తెంతయుఁ

గీ॥ బాలకవియను బిరుదుచే ♦ వరలుచున్న
బళ్ల మల్లయ్య రచియించె ♦ భక్తవరులు।
పఠన మొనరించి ముక్తిని ♦ బడయునటుల।
నీలకంఠేశ శతకంబు ♦ నేర్పుతోడఁ

గీ॥ లలిత పండిత బొండాడ ♦ లక్ష్మణాఖ్య।
కవి యభిప్రాయ విధారీతి ♦ గాను మెచ్చి।
యిచ్చె కవి కాయు రారోగ్య మిచ్చునట్లు
నీలకంఠేశ్వరుఁడు చాలనెనరుతోడ।

ఇట్లు బుధజన విధేయుఁడు,
పండిత బొండాడ లక్ష్మణకవి, లంకలకోడేరు.



# కృతజ్ఞత.

కించిజ్జ్ఞుండనగు నాచే రచియింపఁబడిన, యీనీల కంఠేశ్వర శతకం బమితాదరంబున, నామూలాగ్రమ్ముగ, నవలోకించి, నీరంబులను వీడి, క్షీరంబులను గ్రోలి సంతసించు మరాళ రాజంబుల కైవడి, యిందులఁగల యపశబ్దంబుల నెంచక సుశబ్దములఁ గలరి నాయందనుపమాన కృపా ప్రపూరిత హృదయారవిందులరై సదభిప్రాయములనొసంగిన, జగజ్జన సంస్తూయమాన శేముషీ దురంధరులగు, బ్రిహ్మశ్రీ మంగిపూడి వీరయ్య సిద్ధాంతిగారికిన్ని, బ్రహ్మశ్రీ, ఉభయభాషా ప్రవీణ, ధర్మపురి తిరుమల, లక్ష్మీకుమార వేదాంత తిరుమలాచార్యుల వారికిని, బ్రహ్మశ్రీ పూడి భోగలింగ కవిగారికిని, బ్రహ్మశ్రీ, కడియం తమ్మన్న కవిగారికిని, బ్రహ్మశ్రీ, పండిత, బొండాడలక్ష్మణకవిగారికిని, హృదయపూర్వక సహస్రాభివందనంబు లాచరించుచున్నాడను. మఱియు, నత్యంత ప్రముదితాత్ములరై, వ్యయప్రయాసలకోర్చి, యీశతక మచ్చొత్తించిన,మ॥ రా॥ రా॥ శ్రీ॥ విశ్వనాథం కోటయ్య, సోమన బసవరాజుగార్లకనేక వందన సహస్రంబు లాచరించుచున్నాడను.

ఇట్లు విద్వజ్జన విధేయుఁడు,

బళ్ల మల్లయ్య, గ్రంథకర్త.

ఓం.

శ్రీ బాలా పరమేశ్వరీ దేవ్యైనమః.



# నీలకంఠేశ్వర శతకము.



సీ॥ శ్రీమన్మహేశ్వరా ♦ శ్రితజన మందార !
శంకర ! మాంపాహి ♦ శరణు శరణు
భోగీశవరభూష ! ముని మనోంబుజపూష !
సర్వేశ ! మాంపాహి ♦ శరణు శరణు
గజచర్మ పరిధాన! ♦ కైవల్య సంధాన!
సర్వజ్ఞ ! మాంపాహి ♦ శరణు శరణు
లింగ ! సుచారిత్ర ! ♦ శేఖర్షభస్తోత్రి !
పరశివ ! మాంపాహి ♦ శరణు శరణు

గీ॥ గరిమతోఁ జేసి శతమను ♦ కమలములను
మాలగాఁ గూర్చి యర్పింతు ♦ మదినుతింతు
దగ్గులూరి నివేశ ! పా ♦ తకవినాశ !
నీలకంఠేశ ! నన్నేలు ♦ నిరతమీశ ! 1

సీ॥ ఏసుధాకరబింబ ♦ మేపార నుదయించి
　　నందున చింతాన్వ ♦ యాబ్ధి తనరె
నేభాగ్యశాలి స ♦ ర్వేశ ! నీదయ మహా
　　దైశ్వర్య భోగ జం ♦ భారియయ్యె
నే పండితోత్తముం ♦ డెలమి శిష్యాళుల
　　విద్యాధికులఁ జేసి ♦ వినుతి కెక్కె
నే మహామహుఁడు క ♦ వీశ్వరాభిఖ్యచే
　　దశ దిశా వ్యాప్త స ♦ ద్యశము నొందె
గీ॥ నట్టి (శ్రీ) వీరభద్ర స ♦ మాఖ్యదేశి
కేంద్రుఁబదములఁ గొల్తునే ♦ నిపుడుఁ ప్రేమ
దగ్గులూరి నివేశ ! పా ♦ తక వినాశ !
నీలకంఠేశ ! నన్నేలు ♦ నిరతమీశ ! 　　2

సీ॥ బంధురవిఘ్నాభ్ర ♦ పటల ప్రభంజను
　　సదయాత్ముఁ గజరాజ ♦ వదనుఁ దలఁచి
కంజజోదరురాణిఁ ♦ గవితామ తల్లిని
　　శారదాంబను మదిన్ ♦ సంస్తుతించి
కవి తల్లజుల వ్యాస ♦ కాళిదాసుల నెంచి
　　యాంధ్ర కవీంద్రుల ♦ నభి నుతించి
తల్లికిన్ స్వర్గ సం ♦ ధాముఁడౌ పితకు న
　　త్యంత భక్తి వినతు ♦ లాచరించి
గీ॥ పూజ్యులగు వారలన్ హృదిఁ ♦ బూజసల్పి
సీసశతకంబు నీమీఁద ♦ జేయుచుంటి
దగ్గులూరి నివేశ ! పా ♦ తకవినాశ !
నీల కంఠేశ ! నన్నేలు ♦ నిరతమీశ ! 　　3

సీ॥ వసుధ శ్రీదేవల ♦ బ్రహ్మవంశోద్భవుం
డాశ్వలాయన సూత్రుఁ ♦ డార్యనుతుఁడు
లలిత బళ్ళాన్వయ ♦ జలనిధి చంద్రుండు
మన్మహాఋషి గోత్రి ♦ మహితయశుఁడు
ప్రవిమల గౌరమాం ♦ బకు మల్లికార్జునా
హ్వాయునకుఁ దనయుండు ♦ వరగుణుండు
అచ్చమాంబా హృద ♦ యాంబుజ భానుండు
భవ్య సద్యోజాత ♦ ప్రవర ఘనుఁడు
గీ॥ నైన కనకాఖ్యునకుఁ బ్రీతి ♦ మాత్మజుండ
మల్లయాభిఖ్య కవినభి ♦ మాన ధనుఁడ
దగ్గులూరి నివేశ ! పా ♦ త కవినాశ !
నీల కంఠేశ ! నన్నేలు ♦ నిరత మీశ ! 4

సీ॥ స్థిరకీర్తివంతునిఁ ♦ జెనటులు చేరిన
వరయశ మదిగొఱ ♦ వడని భంగి
శ్రీగంధ వృక్షము ♦ చెంత వేములుగల్గఁ
బరిమళ మిసుమంత ♦ తఱుఁగనటుల
గంగా ప్రవాహమే ♦ గతినెందుఁ బాఱిన
జల మహత్త్వము సన్న ♦ గిలనిరీతి
గోవు పొదుగునందు ♦ గోమారు లుండిన
క్షీరంబునకు రుచి ♦ చెడనిపోల్కి
గీ॥ భక్తిరసమైన నీ పద్య ♦ పాళినెన్ని
నెరసులుండినఁ జవినిచ్చు ♦ నిగమ వేద్య !
దగ్గులూరి నివేశ ! పా ♦ తక వినాశ !
నీల కంఠేశ ! నన్నేలు ♦ నిరతమీశ ! 5

సీ॥ ప్రేమతో నను గని ♦ పెంచిన "పితరులు
శివు దత్తసుతుఁ"డ ని ♦ చెప్పవింటి
నదికారణముగ ని ♦ న్నయ్యగా భావించి
యంబికా గంగల ♦ నంబలుగను
వారణా నన వీర ♦ భద్రేశ భైరవ
గుహులను నాడగు ♦ కూర్మియన్న
లంచెంచి వారల ♦ యర్ధశరీరల
గాదిలి వదెనలు ♦ గాఁగ నెంచి
గీ॥ యంచితంబుగ మిమునాశ్ర ♦ యించి మదిని
శక్తికొలఁదిగ మీసేవ ♦ సల్పుచుంటి
దగ్గులూరి నివేశ ? పా♦ తకవినాశ !
నీల కంఠేశ ? నన్నేలు ♦ నిరతమీశ !

సీ॥ ఇభ చర్మ వసన ! నీ ♦ యింతి నా మనసుగా
దేహంబు నీదగు ♦ దేవళముఁగ
ప్రాణపంచకమును ♦ బరిజనావళిగాఁగ
నఖిలోప భోగము ♦ లర్చనలుగ
గాఢసుషుప్తి సు ♦ జ్ఞాన సమాధిగా
ధరనాదు నడక ప్ర ♦ దక్షిణముఁగ
పలుకులు నీస్తోత్ర ♦ పారాయణములుగా
నాచెయ్వులన్ని నీ ♦ నతులుగాఁగ
గీ॥ నెంచి నాయాత్మ నీవని ♦ యంచితముగ
సంచరింపుచు నుంటిని ♦ సదయ హృదయ!
దగ్గులూరి నివేశ ! పా ♦ తక వినాశ !
నీల కంఠేశ ! నన్నేలు ♦ నిరతమీశ ! 7

సీ॥ శ్రీగిరి రాట్సుతా ♦ చిత్తాబ్జ మధుపాన
బంభరా! పాహితు ♦ భ్యం నమోస్తు
కామాదిరిపు మద ♦ గజ కుంభ విదళిత
పంచాస్య ! పాహితు ♦ భ్యం నమోస్తు
తాపత్రియా భీల ♦ దంత శోకాశన
బర్హిణా! పాహితు ♦ భ్యం నమోస్తు
పటుతర పాపోర్ధ్వ ♦ పర్వత విధ్వంస
వజ్రమా! పాహితు ♦ భ్యం నమోస్తు
గీ॥ భావజోన్మదభంగ ! తు ♦ భ్యం నమోస్తు
వరద! సర్వేశ! శర్వ ! తు ♦ భ్యం నమోస్తు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 8

సీ॥ ఓం కార నిలయాయ ♦ యర్ధ్వ శతాంగాయ,
వందిత భక్తాయ ♦ వందనంబు
నగరాజ సుతమనో ♦ నాళీక ఖేలనా
నంద సంభరితాయ ♦ వందనంబు
మఖవాది సురగణ ♦ మానీంద్ర సేవిత
పాదార విందాయ ♦ వందనంబు
శిశుదేవ ధారుణీ ♦ ధవపుత్రి భల్లాణ
వరసతి బాలాయ ♦ వందనంబు
గీ॥ నాగభేశ్వర వినుతాయ ♦ వందనంబు
యమవినాశాయ, వందనం ♦ బయ్య! శర్వ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 9

సీ॥ అన్నపూర్ణేశ్వర! ♦ యఖిల జనాధార!
ఆగమ సంచార! ♦ యఘ విదూర!
కరధృత సారంగ! ♦ కాలదర్ప విభంగ!
కరుణాంత రంగ! ♦ దుష్కలుష భంగ!
యక్షేశ సంస్తోత్ర! ♦ హరిహయ నుతిపాత్ర!
లక్ష్మీశ మిత్ర స ♦ ల్లలిత గాత్ర!
కుక్షిస్థితాజాండ! ♦ కుధరేంద్ర కోదండ!
పక్షివాహన కాండ! ♦ పాప ఖండ!
గీ॥ సకల మునిజన హృత్సంగ! ♦ శంభులింగ!
నిఖిల లోకైక వందిత! ♦ నిగమ వినుత!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 10

సీ॥ పశ్యల్లలాట ! సం ♦ భరిత గంగాజూట!
నిఖిల లోక స్తుత్య! ♦ నిగమవేద్య!
కాత్యాయనీ లోల! ♦ కరధృత వరశూల!
రవి చంద్ర శిఖనేత్ర! రమ్య గాత్ర!
దక్షాధ్వర ధ్వంస! ♦ దారిద్ర్య విధ్వంస!
పతిత పావన నామ! ♦ భవవిరామ!
హాటకాచల చాప! ♦ యమిత బాహాటోప!
వ్యాఘ్ర చర్మాంబర! ♦ వ్యాళహార!
గీ॥ చిత్తజాంతక ! సర్వేశ! ♦ చిత్ప్రకాశ!
ఆశ్రిత కదంబ ! పూర్ణ కృ ♦ పావలంబ!
దగ్గులూరి నివేశ ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 11

సీ॥ అర్ధేందు కోటీర! ♦ యంబుధి తూణీర!
　　　　ఆశ్రిత సంరక్ష! ♦ యఘ విపక్ష!
శరదభ్రి శుభ్రాంగ! ♦ చండికా హృత్సంగ!
　　　　మార్తాండ సుత భంగ! ♦ మహిశతాంగ!
బ్రహ్మాండ నిర్మాత! భవకల్మషోద్ధూత!
　　　　కంజాక్ష సన్మిత్ర! ♦ కంజనేత్రి!
పండిత సంస్తోత్రి! ♦ పావన చారిత్రి!
　　　　యఖిల లోకాధీశ! ♦ యభ్రికేశ!
గీ॥ దక్ష మఖశిక్ష! భసిత రు ♦ ద్రాక్ష వక్ష!
గోపతి తురంగ! కలిత గం ♦ గోత్తమాంగ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! ♦ నన్నేలు నిరత మీశ!　　12

సీ॥ అంబర కేశ! ది ♦ గంబర సర్వేశ!
　　　　భావజ మదనాశ! ♦ భవ వినాశ!
ఆశ్రిత జనపాల! ♦ యభవ! బ్రోవ విదేల?
　　　　కరగత వరశూల! ♦ కాళిలోల!
భుజగేంద్ర వరభూష! ♦ మునిజన పరితోష!
　　　　కేశవ పోష! వా ♦ గీశ శోష!
ఆర్యా మనోనాథ! ♦ యవిముక్త పురనాథ!
　　　　సంగర యోధ! సు ♦ జ్ఞాన బోధ!
గీ॥ మన్మనోంబుజ వరపూష! ♦ మహిత వేష!
కలిత గుణపూర్ణ! యఖిల జ ♦ గత్ప్రిపూర్ణ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ!　　13

సీ॥ అక్షరంబులకు నా ♦ ద్యక్షరమై బిందు
యుతముగఁ బ్రణవమై యొప్పినావు,
వర్ణ త్రియంబున ♦ వాక్సతీ, మా, యుమా
కాంతలై, పతులునై ♦ గ్రాలినావు,
పంచ భూతము లునై, ♦ పవలునై, నిశియునై,
బహిరంత రంబులఁ ♦ బరగె దీవు,
సచరా చరంబునై, ♦ సర్వంబు శూన్యమై,
యెంచ శక్యము గాక ♦ యెసగె దీవు,
గీ॥ ఆది మధ్యాంత రహితమై ♦ యలరె దీవు
నాద బిందు కళాతీత। ♦ సాధు వినుత।
దగ్గులూరి నివేశ। పా ♦ తక వినాశ।
నీల కంఠేశ। నన్నేలు ♦ నిరత మీశ। 14

సీ॥ ఊహాక తీతమై ♦ యున్నాడ వీవన్న
పన్నగ భూష। ని ♦ న్నెన్నఁ గలన।
సకల రూపము లొంది ♦ సంచరింతు వటన్న
కలనిజ రూపునేఁ ♦ గాంచఁ గలన
లెక్కకు మీరిన ♦ పెక్కు నామములున్న
పేర్వెట్టి నిన్ను నేఁ ♦ బిలువఁ గలన
చిక్కక, కానక ♦ చెలఁగుచు నీవున్న
చెనఁటిని నిన్ను నేఁ ♦ జేరగలన।
గీ॥ చావు పుట్టుక లేనట్టి ♦ సామి వన్న
కామ విధ్వంసి। సురలలో ♦ ఘనుఁడ వన్న
దగ్గులూరి నివేశ। పా ♦ తక వినాశ।
నీల కంఠేశ। నన్నేలు ♦ నిరత మీశ। 15

సీ॥ ఋక్షేశ మౌళి! ని ♦ ర్నిద్ర! శ్రీకపాలి!
నతజన పరితోష! ♦ నాగభూష!
వారి జాంతాంబక! ♦ వంచిత మకరాంక!
శ్రితజన భరిత! వి ♦ రించి వినుత!
పార్థసారథి మిత్ర! ♦ పావన చారిత్ర!
మునిజన హృత్సంగ! ♦ మోహనాంగ!
కటి బద్ధ కరిచేల! ♦ కరధృత కంకాళ!
యాంధక ♦ దను జారి! ♦ యఘ విదారి!
గీ॥ నిగమ సంచార! పురహార! ♦ నిర్వికార!
శారదాభ్ర శరీర! ప్ర ♦ చండ వీర!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 16

సీ॥ పురహార! నీదు కా ♦ పురమొక వెలికొండ
సనకాది మునులు నీ ♦ సరసనుండ
బలభేది నీ మృదు ♦ పదము లొత్తుచునుండ
హరి యజుల్ నీ యాజ్ఞ ♦ కడలుచుండ
జాహ్నవీ కన్య నీ ♦ జటలఁ బాయకయుండ
వనజారి రేఖ యా ♦ వంకనుండ
సర్వ మంగళ నీదు ♦ సామేను నందుండఁ
దొడలపై నీముద్దు ♦ కొడుకులుండఁ
గీ॥ బట్టి నాడవు నీ చేతఁ ♦ బైడికొండ
భళిర! చేర్చుము నన్ను నీ ♦ పజ్జనుండ
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 17

సీ॥ భవహార! నీనామ ♦ భజన ముక్తికిఁ దోవ
భువనముల్ బ్రీతితోఁ ♦ బ్రోతు వీవ
నగరిపు వంద్య! మై ♦ నాకుండు నీ బావ
త్రిపుర దైతేయులఁ ♦ ద్రుంచి తీవ
అంగజ భంగ! వే ♦ దాంత వేద్యుఁడ వీవ
బాల మార్కండేయు ♦ నేలితీవ
నంది వాహన! భక్త ♦ బృంద వందిత! కావ
రావదేలను? గావ ♦ లేవ దేవ?
గీ॥ వర దయాకర! పరశివ! వామదేవ!
అవ్యయానంద మీవ! మ ♦ హాను భావ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 18
సీ॥ భుజగేంద్ర కేయూర! ♦ భువన త్రయాధార!
నిగ మాంత సంచార! ♦ నిర్వికార!
శరణా గత త్రాణ! ♦ శంకర! హరి బాణ!
శరనిధి వరతూణ! ♦ శమన హరణ!
ముని జనాశ్రిత పాద ♦ వనజ! జనామోద!
పార్వతీ నాధ! స ♦ త్ప్రణవ బోధ!
భక్త జనస్తోత్ర! ♦ పర్జన్య నుతి పాత్ర!
రవిచంద్ర శిఖినేత్ర! ♦ రమ్యగాత్ర!
గీ॥ పాణి గతయేణ! వరద! కృ ♦ పా ధురీణ!
భవ్య గురులింగ! భర్గ! మ ♦ త్ప్రాణ లింగ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 19

సీ|| శంకరా! భక్తన ♦ శంకరా! పాప భ
యంకరా! ప్రోవు మీ ♦ నాంక జైత్ర!
ఈశ్వరా! గిరిసుతా ♦ ధీశ్వరా! యఖిల లో
కేశ్వరా! యేలు సు ♦ రేశ వినుత!
లింగమా! వెలికొండ ♦ జంగమా! కరుణాంత
రంగమా! కావు సా ♦ రంగపాణి!
వీరుఁడా! వన ధిగం ♦ భీరుఁడా! లోకైక
శూరుఁడా! సాఁ ♦ కుమన్ సూరి వంద్య!
గీ|| అవ్య యానంద సంధాన! ♦ యబ్ధి తూణ!
ప్రథిత గుణరాయ! సర్వజ్ఞ! ♦ ప్రణవ నిలయ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 20

సీ|| నిను నమ్మి పూజించు ♦ నిర్మల చరితుల
భవరోగ భయ భిష ♦ గ్వరుఁడ వీవు,
నిను నమ్మి పూజించు ♦ నిర్మల చరితుల
దారిద్ర్య దుఃఖాబ్ధి ♦ తరణి వీవు,
నిను నమ్మి పూజించు ♦ నిర్మల చరితుల
యరిగజదళిత హ ♦ ర్యక్ష మీవు,
నిను నమ్మి పూజించు ♦ నిర్మల చరితుల
విపుల పాపలతాల ♦ విత్రి మీవు,
గీ|| నిన్ను నెదనమ్మి పూజించు ♦ చున్నయట్టి
సాధు హృదయులకుఁ గల్ప ♦ సాల మీవు,
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 21

సీ॥ పతిత పావన శీల ! పార్వతీ హృల్లోల!
కరుణాల వాల! న ♦ న్నావవేల।
భక్తమానస హంస। ♦ భవభయ విధ్వంస!
కరుణాల వాల! న ♦ న్నావవేల!
పాపాట వీదాహ। ♦ పశుపతీ సిరోన్మహ।
కరుణాల వాల। న ♦ న్నావ వేల।
భావ జోన్మద భంగ♦ భస్మ లివిప్తాంగ।
కరుణాల వాల। న ♦ న్నావవేల।
గీ॥ సరస గుణజాల? నన్నావ ♦ జాలమేల
జాలి। నన్నావకున్న నీ ♦ శీల మేల?
దగ్గులూరి నివేశ। పా ♦ తక వినాశ।
నీల కంఠేశ। నన్నేలు ♦ నిరత మీశ। 22

సీ॥ కుల పావనుండగు ♦ కొమరునిం జంపిన
కోపంబు లేక ని ♦ న్గొలుచు విష్ణు
ఐనన తలఁ గోసి ♦ యుపహ సించిన నిన్ను
భక్తితోఁ బూజింపుఁ ♦ బద్మజుఁడు
పడఁదన్ని తన ధర్మ ♦ పాలనం బుడిపిసఁ
బ్రార్థించుచుండు నై ♦ వస్వతుఁడు
మహనీయ విభవము ♦ ల్మంటి పాల్జేసిన
వినుతించు చుండును ♦ వివిధ జగము
గీ॥ లాది మధ్యాంత రహిత। నీ ♦ యధిక శక్తిఁ
దెలిసి వర్ణింప వేనోళ్ళ ♦ చిలువ తరమె।
దగ్గులూరి నివేశ। పా ♦ తక వినాశ।
నీల కంఠేశ। నన్నేలు ♦ నిరత మీశ। 23

సీ॥ నీ కృపచేఁ గాదె? ♦ నిఖిలముఁ సృష్టించు
 నమిత ధీశక్తి యా ♦ యజునకబ్బె
నీ కృపచేఁ గాదె? నిఖిల జీవులఁ బోచు
 దాక్షిణ్య మది రమా ♦ ధవునకబ్బె
నీ కృపచేఁ గాదె? ♦ నిఖిల లోకవ్యాప్తి
 దార్ఢ్యంబు పంచ భూ ♦ తముల కబ్బె
నీ కృపచేఁ గాదె? ♦ నిబిడాంధతను బాపు
 వరతేజ మిందు భా ♦ స్కరుల కబ్బె
గీ॥ నీదు సత్కృపచేఁ గాదె? ♦ నిర్జరేంద్రుఁ
డాది గాఁగల దేవతు ♦ లధికులైరి
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 24

సీ॥ ఉదకములేకను బట్టి ♦ యొక కృక్కఁ గొనునేర్పుఁ
 గలశజుం డెటేఁగె నీ ♦ కరుణ వలన
స్వచ్ఛంద జీవియై ♦ సమయఁ జాలెడి శక్తి
 గాంగేయుఁ డొందె నీ ♦ కరుణ వలన
సృష్టికిఁ బ్రతిసృష్టిఁ ♦ జేయఁజాలెడు యుక్తి
 గాధేయుఁడందె నీ ♦ కరుణ వలన
పాప పుణ్యము లెంచి ♦ పాలించు ధీశక్తి
 కాలుండు పొందె నీ! ♦ కరుణ వలన
గీ॥ భక్త రక్షణ దీక్షా ని ♦ బద్ధమైన
కంకణంబది కరమునఁ ♦ గట్టితౌర!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 25

సీ॥ ఘోర కృత్యము లెన్నొ ♦ కోరిచేసిన ఘన
పాపుండ నంటఁ గా ♦ పాడు మంటి,
సతి సుతాదులఁ బెంచఁ ♦ జాలని దారిద్ర్య
వంతుండ నంటిఁగా ♦ పాడు మంటి,
భక్త జనావన! ♦ భవ వార్ధితరణ! నీ
భక్తుండ నంటిఁగా ♦ పాడు మంటిఁ
బండిత పాల! నీ ♦ యండఁ జేరఁగ నున్న
వాఁడను నంటిఁ గా ♦ పాడు మంటి,
గీ॥ భక్త వత్సలుడని బుధు ♦ ల్బల్క వింటిఁ
బ్రాణ లింగమ! నన్నుఁగా ♦ పాడు మంటి,
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 26

సీ॥ రాజ్యార్థులకును సా ♦ మ్రాజ్యంబు లొసఁగియుఁ
గొండపైఁ గాపురం ♦ బుండినావు,
వస్త్రార్థులకునున్న ♦ వస్త్రంబు లర్పించి
గబ్బి మెకము తోలుఁ ♦ గట్టినావు,
భూషణార్థులకున్న ♦ భూషలన్నియు నిచ్చి
పుట్ట పుర్వుల మేనఁ ♦ బెట్టినావు,
విభవార్థులకుఁగల ♦ విభవాదులను విడి
వెఱ్ఱెత్తి బిక్షకై ♦ వెడలినావు,
గీ॥ వాహనార్థుల కీడి బహు ♦ వాహనములు
బక్క చిక్కిన యెద్దుపై ♦ నెక్కినావు,
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 27

సీ॥ కంజాతుఁ డరి లోక ♦ భంజనంబగు చక్రి
రాజార్థియై భవ ♦ త్పూజ కొఱకు
నత్యంత ముదముతోఁ ♦ బ్రత్యహంబును వేయి
వర పద్మములఁ దెచ్చి ♦ సరస నునిచి
"ఓం నమశ్శివ" యంచు ♦ నొనరఁగా నర్చించు
చుండ నొండొకనాఁడు ♦ నూన మొకటి
న్యూనతఁ గన్పింప ♦ దీనతఁ బూనక
సాహసంబున నేత్ర ♦ సరసిజంబుఁ
గీ॥ గోటఁ బెకలించి యర్పింపఁ ♦ గుతుక మంది
చక్రమును నిచ్చి సాఁక వే ♦ సాధుహృదయ
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ!  28

సీ॥ శ్రీశార్వరీ! శర్వ! ♦ శ్రీలిడు చుండుమా!
సతత మర్థులకిడ ♦ సాఁకు కొఱకు
మన్మథాంతక! నాదు ♦ మనమున నిల్వుమా!
భావ వికారము ♦ ల్బాపు కొఱకు
వేద తురంగ! ♦ సద్విద్యల నీయుమా!
"శివుడె పరుం" డని చెప్పు కొఱకు
విజ్ఞానమూర్తి! న ♦ న్విబుధుని జేయుమా!
శివ! నీదు సాయుజ్య ♦ సిద్ధికొఱకు
గీ॥ ననుచుఁ బ్రార్థింతు నీతినను దినంబు
నవ్య యానంద సంధాన! ♦ యభిత్రాణ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ!  29

సీ॥ భక్తాళిపైఁ బ్రీతి ♦ భావ ముంచుటఁ జేసి
"భక్త వత్సలుఁ" డనఁ ♦ బరగు దీవు,
పశుతుల్య జీవులఁ ♦ బాలించుటను జేసి
"పశుపతి" యని ♦ పిల్వఁ బడుదు వీవు,
గంగను నుత్తమాంగ ♦ మునఁ దాల్చుటఁ జేసి
"గంగాధరుం" డనఁగా్రిలుదీవు!
ఘనభయంకరమగు ♦ గరళ మానుటఁ జేసి
"గరళ కంఠుం" డన ♦ వరలుదీవు,
గీ॥ మృత్యు దేవత పాలిట ♦ మిత్తి వగుటఁ
జేసి "మృత్యుంజయాఖ్య" ను ♦ జెలఁగు దీవు,
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 30

సీ॥ సురల సురులు గూడి ♦ సుధకునై క్షీరాబ్ధిఁ
దరువఁగా మందర ♦ గిరిని దెచ్చి
వాసుకీంద్రుని జుట్టి ♦ వడివడిఁ ద్రిచ్చంగ
ఛటఛటా ర్భటులతోఁ ♦ చదలు వగుల
ధూమాగ్ని జ్వాలల ♦ తోఁ బ్రభవించిన
విసమున కడలి వా ♦ "రసమనయన!
పశుపతీ! పరశివా! ♦ పాహిమాం" యని మొఱ
వెట్టఁ దద్విషమును ♦ బట్టి వేడ్క
గీ॥ ఫలము వోలెను మ్రింగియు ♦ గళము నందు
చిహ్న మట్టులఁ దాల్చవే? ♦ చిద్విలాస!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 31

సీ॥ ఉరగేంద్రభూష! నా ♦ యూపిరి బొందెలో
　　నున్నంత వరకు ని ♦ న్నెన్నఁగలనొ
లేదొ? నే నెఱుఁగ నే ♦ నీలఁ జరింతునో?
　　మత్పూర్వ భవకర్మ ♦ మారుటెట్టులొ?
తెలియఁ జాలనుగదా ♦ దేవ! భవాంబుధి
　　దాటలేనని భీతిఁ ♦ దవిలినీ వె
దీనులపాలిఁట ♦ దిక్కని మదినమ్మి
　　ప్రార్థింపుచుంటి న ♦ న్నాలముంచు
గీ॥ నీట ముంచు మికెట్టులైన ♦ నిన్నుఁగూర్చి
స్తవముఁజేయుటయే నాదు ♦ తలఁపు శర్వ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ!　　32

సీ॥ శ్రీ మహా విష్ణ్వంశఁ ♦ జెన్నొంది జగదైక
　　వీరుఁడై వేదాంత ♦ వేద్యుఁడైన
రాముండు భార్యకై ♦ రావణ బ్రహ్మను
　　నిలఁగూల్చి తద్దోష ♦ మిను మడంప
దైవజ్ఞ నిర్దిష్ట ♦ తంబైన సుముహూర్త
　　మందున రామలిం ♦ గాభిధేయ
మునఁబ్రతిష్ఠించినిశ్రీము♦దముతోఁగొన్నాళ్లు
　　పూజించి పాప వి ♦ ముక్తి నొందె
గీ॥ భళిర! శ్రీ రామునంతటి ♦ ప్రభువుఁబట్టి
బాధలిడు బ్రహ్మ హత్యను ♦ బాపినావు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ!　　33

సీ॥ ఆశ్రితకల్ప! ని ♦ న్నర్చించువారలే
యతులిత సంపద ♦ లను భవింతు,
కామవిధ్వంసి! ని ♦ న్గణుతించువారలే
మోహాదులను వీడి ♦ మురియుచుండ్రు,
దక్షిణామూర్తి! ని ♦ న్దర్శించువారలే
విజ్ఞాన ధనులౌచు ♦ వెలయుచుండ్రు,
మార్కండ రక్ష! ని ♦ న్మదిఁ గాంచువారలే
యమబాధ వీడి నీ ♦ యండనుండు,
గీ॥ కాన నను నీదు భక్తునిఁగా నొనర్చి
కొమ్ము! భవదీయ సాయుజ్య ♦ మిమ్ము! కృపను,
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 34

సీ॥ నారాయణాంశచే ♦ నవతరించియు మౌని
వరులలో ఘనుఁడని ♦ వాసిఁగాంచి
వ్యాసుండు పరివిమల ♦ వారణా సింజేరి
గంగలో స్నానంబుఁ ♦ గ్రమతఁ జేసి
కరములు జోడించి ♦ "ఘనుఁడు కేశవుఁ"డనఁ
గోపించి కేల్ద్రోయుఁ ♦ గోసియతని
మద మడంచిన లజ్జ ♦ మనమునఁ బెనఁగొని
శరణని వేడ యా ♦ సంగమిూందు
గీ॥ నాత్మశుద్ధికి సంతస ♦ మంది కనక
హస్తయుగ్మంబు నీయవే ♦ యభవ! దయను,
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ!

సీ॥ విశ్వమోహనమైన ♦ వేషముం ద్యజియించి
స్థళపతి జంగమై ♦ తరలినావు,
బహురత్నరచిత స ♦ త్పాత్రిల విడనాడి
తళియగాఁబూత్తెను ♦ దాల్చినావు,
నిస్తులదీప్త ప్రి ♦ శస్తభూషల వీడి
పునుక లెమ్ముల మాలఁ ♦ బూనినావు,
షడ్రసోపేతమా ♦ శాల్యాన్నమును వీడి
తిరిపెమోగిరమును ♦ దిందువీవు,
గీ॥ ధరఁ "బరోప కారార్థమి ♦ దంశరీర"
మనుచు లోకులు దెలియగా ♦ న భ్రకేశ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 36

సీ॥ శ్రీ శివా! నీ దగు ♦ చిహ్నముల్ ధరియించు
భక్తులు గోరునే ♦ వస్తువేని
ముదముతో నర్పించు ♦ సదమల చరితుఁడౌ
భళ్ళాణ రాజ స ♦ త్ప్రభుపు నింటి
కతిథివై చని వాని ♦ యాతిథ్యమును నంది
మార ధనుర్ముక్త ♦ మార్గణాగ్ని
తప్తయై శోషిల్లు ♦ తనువల్లి కంపింప
లావణ్య ఖనియు స ♦ ల్లలిత చరిత
గీ॥ వేశ్యనుంగోర రాజదే ♦ వేరినను ప
ముట్టకయె పట్టి పెకను ♦ పట్టి నట్టి
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ!

సీ॥ పండితావనశీల! ♦ పాలింప రావేల?
జాల మిదేల! ద ♦ యాలవాల!
భక్తమానస లోల! ♦ పరశివ! రావేల?
జాలమిదేల! ద ♦ యాలవాల!
తాపస జన పాల! ♦ దయఁజూడ రావేల?
జాలమిదేల! ద ♦ యాలవాల!
భరిత సద్గుణజాల! ♦ పరమాత్మ రావేల?
జాలమిదేల! ద ♦ యాలవాల!
గీ॥ నీలలోహిత ఫాల! ద ♦ యాలవాల!
ఆశ్రితజనాళి పాల! ద ♦ యాలవాల!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 38

సీ॥ అఖిలాండ కోటి య ♦ జాండస్థితోదర!
శ్రీకర ! పార్వతీ ♦ చిత్తచోర!
నీరజాసన ముఖ్య ♦ నిర్జరావన శీల!
సన్ముని పాల! కాషాయచేల!
దారుకావనమౌని ♦ తరుణీ వ్రతచ్ఛేద!
సర్వజ్ఞ! వరద! సు ♦ జ్ఞానబోధ!
భావజ దుర్మద ♦ భంగ! సు చారిత్ర!
సూర్యేందు శిఖనేత! ♦ శుభ్రగాత్ర!
గీ॥ కాలమదనాశ! త్రిపుర రా ♦ క్షస వినాశ!
సరస గుణధామ! దేవదా ♦ సార్వభౌమ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 39

సీ॥ పౌలస్త్యుఁడాశతోఁ ♦ బ్రార్థింపఁ గడుమెచ్చి
నవ నిధులొసఁగవే! ♦ నాగభూష!
అగరాజ సుతభక్తి ♦ నర్చింపఁగా నచ్చి
సామేను నీయవే! ♦ చంద్రజూట!
ఫల్గుణుఁడర్థియై ♦ ప్రణుతించినఁ గోరి
పాశుపతంబీవె! ♦ భవవినాశ!
ఆర్తులు దీనులై ♦ ధ్యానింప ముదమంది
కోర్కులఁ దీర్పవే! ♦ కుధర నిలయ!
గీ॥ భక్తులందున నీకృప ♦ ప్రబలియుంటఁ
గామితార్థంబులొసఁగఁ గూర్చి ♦ కాతువయ్య!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 40

సీ॥ తల్లిలేదని పెంచు ♦ తరిసి గల్గిన పాల
పాప చిన్నను మాన్పఁ ♦ బడతియోర్తు,
వ్రేలెడు నీమేని ♦ వివిధ భాగములెంచి
మాన్పె దూపాడిచియు ♦ మగువయోర్తు,
పొట్టకై యాడాడఁ ♦ బోవుచుండఁగఁబిల్చి
పిట్టు నీకదుపారఁ ♦ బెట్టెనోర్తు
"మరుబారి కోర్వనే ♦ మానినీ!" యనఁజీరి
కల్లుకుండను దూర్చె ♦ కలికియోర్తు,
గీ॥ బాలునిగఁ జేసె నిను రాజ ♦ పత్నియోర్తు,
యిట్టి నీ చెయ్వులను విని ♦ యెట్టులోర్తు,
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 41

సీ॥ అర్ధ శరీర మం ♦ ద మరెను ముదియాలు,
పెన్నెఱుల్ గుంపులోఁ ♦ బిన్నయాలు,
గబ్బిమెకముతోలు ♦ కటి బద్ధ మగు శాలు,
బుస పుర్వులాడలిపై ♦ భూషణాలు,
రుదురాకపు సరంబు ♦ లెదను మెండుగవ్రేలు,
దండిగాఁ జుట్టు భూ ♦ తాల చాలు,
కర్కశదనుజుల ♦ ఖండించుఁ జేవాలు,
పొక్కిలి పసిబిడ్డ ♦ పునుక డాలు,
గీ॥ పట్టఁగను నుండగను మేటి ♦ పర్వతాలు,
సకల వేదాలు చదువు నీ ♦ సన్నుతాలు,
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 42

సీ॥ పంచాక్షరీ మంత్రి ♦ భస్మ ప్రభావముల్
కల్మష పదుఁడర్జ ♦ ఘనుఁడెఱుంగు,
పంచాక్షరీ మంత్రి ♦ భస్మ ప్రభావముల్
భద్రాయువను రాజ ♦ వరుఁడెఱుంగు,
పంచాక్షరీ మంత్రి ♦ భస్మ ప్రభావముల్
సానందముని మన ♦ సారనెఱుంగు,
పంచాక్షరీ మంత్రి ♦ భస్మ ప్రభావముల్
భక్తుఁడైన మృకండ ♦ బాలుఁడెఱుంగు,
గీ॥ నింక నెందఱో సద్భక్తు లెఱిఁగియుండి
రెఱుఁగ నెంతురె? మూఢాత్ము ♦ లెదను మేశ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 43

సీ॥ నినువోలె నితరులఁ ♦ గొనియాడ నెన్నఁడు
నీకన్న దిక్కొకఁ ♦ డాకు గలరె?
తల్లి దండ్రులు, నన్న ♦ దమ్ములు, గురుఁడాది
యాత్మబాంధవులు నీ ♦ వనుచు నేను
భావించి మన్మనో ♦ పంజరంబున నుంచి
సతతంబు నిర్మల ♦ స్వాంతు నిన్ను
"పతిత పావన! శర్వ! ♦ పరశివ! సర్వేశ!
బాలేందు మకుట! న ♦ న్నేలు" మంచు
గీ॥ జపముఁ జేయుచు నుంటిని ♦ సాంబమూర్తి!
సాధుజన వర్తి! దేవతా ♦ చక్రవర్తి!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 44

సీ॥ "కూలికై యేతెంచి ♦ కూర్కెడు దేయని
తట్టినవానిఁ ద ♦ తణమె చంపఁ
గూడునే!"యని రాజు ♦ కోపించి పలికినఁ
దనయెదఁ జీల్చి త ♦ ద్హృదయ మందు
నఖిలేశ! నినుఁబ్రీతి ♦ నర్చించు విధమెల్ల
జనులకుఁ జూపి "యా ♦ పరసఁబడిన
దధిభాండ మీదుష్టుఁ ♦ దప నెఱుంగక యిట్లు
చేయఁగూల్చితి"నని ♦ చెప్పితిరుగ
గీ॥ నతని జీవింపఁ జేసిన ♦ యాత్మదేవు
మహిమ నెన్నఁగ నీయదే ♦ మాన్య చరిత!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 45

సీ॥ రమణీయ తరమైన ♦ రౌప్యా చలము నీకుఁ
బూరింటిలోనఁ గా ♦ పురము నాకు
నరి లోకభంజనం ♦ బైన శూలము నీకు
భుక్తిఁ గూర్పఁగఁ గట్టె ♦ పుల్లనాకు,
భానుకోటి ద్యుతిఁ ♦ బరగు దేహము నీకు
నతి హేయమైన కా ♦ యంబు నాకు,
బ్రహ్మాది దివిజుల ♦ ప్రార్థనంబులు నీకుఁ
బలువురిలో నగు ♦ బాట్లు నాకు
గీ॥ నధిక విఖ్యాతి పదవి నీ ♦ వందుకొనియు
హీన పదవిని నిడితె! నా ♦ కిందు మౌళి!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 46

సీ॥ పయనంబునకు నీకు ♦ బలసిన యెద్దున్నఁ
గదలి పోవఁగ నాకుఁ ♦ గాళ్లు గలవు,
పదునాల్గు లోకముల్ ♦ బాలింప నీకున్న
నడిగి తినుటకు నాకు ♦ నవని గలదు,
పావన చరితలౌ ♦ భార్యలు నీకున్నఁ
బడసి యుంటిని నేను ♦ భార్య నొకతె,
శయనించుటకుఁ బుష్ప ♦ శయ్యలు నీకున్న
నా కున్నదొక తాటి ♦ యాకుచాప,
గీ॥ గొప్ప దేవుండనని నీవు ♦ కులుకుచుండ
మేటి పల్గాకినై నేను ♦ మెలగుచుంటి,
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 47

సీ॥ హర! గిరిజా మనో ♦ హర! పుర దైత్య సం
హర! రౌప్య నగవి ♦ హార! భర్గ!
శంకర! శమన భ ♦ యంకర! సుజన వ
శంకర! బాల మృ ♦ గాంక ముకుట!
లింగ! మునిజన హృ ♦ త్సంగ! కరధృత కు
రంగ! శ్రీగంగోత్త ♦ మాంగ! యభవ!
సాంబ! దుష్కర్మాద్రి ♦ శంబ! భక్త జన క
దంబ! విసర్జిత ♦ శంబరారి!
గీ॥ వరద! వాసవ నుతపద! ♦ ప్రణవ బోధ!
శూలి! రిపుజన కువలయ ♦ పాళిహేళి!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 48

సీ॥ ధరణి రథంబుగాఁ ♦ దర ణేందుల రథ చ
క్రములుగా శ్రుతులు గు ♦ఱ్ఱములు గాఁగ
సరసిజ జన్ముండు ♦ సారథి గాఁగను
భర్మ భూధరము చా ♦ పంబు గాఁగ
జిహ్వాగేంద్రుండాది ♦ శేషుండు నారిగా
నారాయణుండు బా ♦ ణంబు గాఁగ
శరధి తూణంబుగా ♦ సురలు సైన్యంబుగా
నాశాధి పతులు సై ♦ న్యాధిపులుగ
గీ॥ జేసికొని వెసనేగి య ♦ జేయులైన
త్రిపుర దనుజులఁ ద్రుంచవే! దేవదేవ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 49

సీ॥ పన్నగ భూష! యా ♦ పన్న జనాధార!
సన్నుతాకార! ప్రి ♦ సన్న వక్త్ర!
అంగజ భంగ! కృ ♦ పాపాంగ గంగోత్త
మాంగ! ఖట్వాంగ! సా ♦ రంగ హస్త!
నంది వాహ! సుర ♦ బృందార్చితా! శర
దిందు ప్రకాశ! య ♦ ర్ధేందు చూడ!
పండిత పోష! మా ♦ ర్తాండజ శిక్ష! మా
ర్కండ సంరక్ష! బ్ర ♦ హ్మాండ పోష!
గీ॥ త్రిపుర దైతేయ సంహార! ♦ త్రిదశ వినుత!
అభవ! పరమేశ! జగదీశ! ♦ యభ్రకేశ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 50

సీ॥ భుజగేంద్ర కేయూర! ♦ భువనత్రయా ధార!
నిగమాంత సంచార! ♦ నిర్వికార!
శరణా గతత్రాణ! ♦ శంకర! హరిబాణ!
శరనిధి వరతూణ! ♦ శమన హరణ!
ముని జనాశ్రిత పాద ♦ వనజ! జనామోద!
పార్వతీనాథ! స ♦ త్ప్రణవ బోధ!
భక్త జనస్తోత్ర! ♦ పర్జన్య నుతి పాత్ర!
రవి, చంద్ర, శిఖినేత్ర! ♦ రమ్య గాత్ర!
గీ॥ పాణి గతయేణ! వరద! కృ ♦ పా ధురీణ!
భవ్య గురు లింగ! శర్వ! మ ♦ త్ప్రాణ లింగ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 51

సీ॥ శ్రీయాళ భూపాల ♦ శేఖరు సద్భక్తి
నరయ నెంచియు వాని ♦ దరికి జంగ
మాకృతిఁ జని ప్రీతి ♦ నర్ఘ్య పాద్యంబులఁ
గొని సద్గుణుండైన ♦ కొమరుఁ జదిపి
కూరగాఁ బెట్టిన ♦ కూర్మితో భుజియింతు
నని పల్కి బాలునిఁ ♦ దునుమఁజేసి,
పచనంబుఁ జేయించి, "పజ్జను గూర్చుండి
సాపడుటకు నీదు ♦ చంటి కఱ్ఱఁ
గీ॥ బిల్వు" మని చెప్పి పిలిపించి ♦ బిడ్డ నపుడె
బ్రిదుకఁ జేసియు మోక్షంబు ♦ వారి కిడవె?
దగ్గులూరి నివేశ! హా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 52

సీ॥ ఏండేండ్లయీడునఁ ♦ దోడి బాలురఁ గూడి
యాడుచుఁ దాను "దీ ♦ పాళి నాటి
కేదెత్తు మాయక్క ♦ కేల్వట్టి బావతో
ముచ్చట లాడుచు ♦ ముదముతోడ"
నని చెప్పి శ్రీగిరి ♦ కరుదెంచి నినుఁ బిల్చి
మైధున రాముని ♦ మహిత దీక్ష
కలరి బాంధవ్యంబు ♦ సెలఁగ విందులఁ దన్పి
సతి సుతాదులతోడఁ ♦ జనియు వాని
గీ॥ యింట భుజియించి యతని నెం ♦ తేనిఁ బేర్మిఁ
దల్లితోఁ దేవె? కైలాస ♦ ధామమునకు
దగ్గులూరి నివేశ! హా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 53

సీ॥ “విషపాన మాదిగా ♦ వివిధ రీతుల నేనిఁ
జూపు నెఱుంగని ♦ సామి వగుట
నతులిత సంపద ♦ లాశ్రితాళికి నెప్డుఁ
బ్రీతితో నిచ్చుచుండు ♦ దాత వగుట
స చరాచరంబును ♦ సమ బుద్ధితో నని
శంబుఁగాంచు జగత్కు ♦ టుంబి వగుట
సహజ సౌందర్య వా ♦ క్చాతుర్య సాహస
గాంభీర్య కళలను ♦ ఘనుఁడ వగుట
గీ॥ నీకు సరిబోలు వారలే ♦ లోకములను
లేర” టందురు విబుధులు ♦ శూరి వంద్య
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 54
సీ॥ ఆరోహ ణావరో ♦ హణముల శృతిఁ గల్పి
వాణీ మహాదేవి ♦ వీణ మీటు
నక్షర కాలంబు ♦ నావంతఁ దప్పక
యంబు జూసనుఁడు ♦ దాళంబు గొల్చు
శబ్ద తరంగముల్ ♦ చదలంట శ్రీహరి
మించి మద్దెలను వా ♦ యించుచుండ
కఠిన పాషాణముల్ ♦ గరఁగెడి నోఁయన
సుర సార్వభౌముండు ♦ మురళినూద
గీ॥ నల్పుచుందువు నాట్యంబు ♦ సంజవేళ
లందు నిత్యంబు జగదంబ ♦ ముందు భర్గ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 55

సీ॥ ఎఱిఁగిన నీతుల ♦ నెలమి సత్పండితుల్
    ప్రకటనఁ జేతురు ♦ పరమ ధర్మ
మగుటచే నవిఁగని ♦ యత్యంత ముదమంది
    యాచరించుచు నుందు ♦ రమల మతులు
మూఢులు గొందరీ ♦ మూలం బెఱుంగక
    "వ్రాసిన రీతిగాఁ ♦ జేసినారె
చెప్పిన ధర్మము ♦ ల్నెడక వర్తించిరే"
    యనుచుఁ బరీతుల ♦ నపహసింత్రు
గీ॥ సకల సౌఖ్య ప్రదాయియా ♦ చంద్రకిరణ
జాలముల కీసుఁ జెందెడు ♦ జారులట్లు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ!    56

సీ॥ రూప నామములు ని ♦ రూపించు వేల్పేలఁ
    జామీకరంబగ ♦ సాలి కఱఁగి
రూప నామములు ని ♦ రూపించు వేల్పేల
    మట్టి కుమ్మరి చేతఁ ♦ బట్టి తట్టి
రూప నామములు ని ♦ రూపించు వేల్పేలఁ
    నెంచి బట్టలఁ గత్తి ♦ రించి దర్జి
రూప నామములు ని ♦ రూపించు వేల్పేలఁ
    నాత్మ సంచిత కర్మ ♦ లరసి బ్రహ్మ
గీ॥ వస్తువొక్కటిఁ జేఁబట్టి ♦ వలయునట్లు
సృష్టిఁ గావించి వారలు ♦ తృష్టులైరి,
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ!    57

సీ॥ కాయ కష్టమునకుఁ ♦ గడు నోర్చియును గృషి
నొనరుపఁ గఱ వెట్లు ♦ లొదవునయ్య?
పరిశుద్ధ హృదయుఁడై ♦ భక్తితో నీ జప
మొనరింపఁ బాప మె ♦ ట్లొదవునయ్య?
పరులాడు నీచపుఁ ♦ బల్కుల కెపుడు మా
ఱాడమి వైరమె ♦ ట్లలమునయ్య?
అప్రమత్తుండునై ♦ యరయుచు జాగ్రత
నందిన భయ మెట్టు ♦ లందునయ్య?
గీ॥ గతము నెంచక నిశ్చల ♦ మతిని నిన్నుఁ
గాంచు వాఁడెట్లు మఱల జ ♦ న్మించు నయ్య?
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 58

సీ॥ శ్రీలక్ష్మి తన యింట ♦ స్థిరముగాఁ నిలచును
పావనంబైనట్టి ♦ వాణియైన
హితులును బంధువుల్ ♦ గుతుకంబుఁ గూర్తురు
భవ్యతరంబైన ♦ వాణియైన
చెడ్డ వాఁడనిపించి ♦ చెఱ నుండఁగాఁ జేయుఁ
బాడి వీడి పలుకు ♦ వాణియైన
సకలంబు నెడఁ బాపి ♦ చావును సమకూర్చు
కాని పల్కులఁ బల్కు ♦ వాణియైన
గీ॥ సౌఖ్య యుతమగు కీర్తిని ♦ సంతరించి
పూని నినుఁజేర్చి తీరు సు ♦ వాణియైన
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 59

సీ॥ సతి సుతాదుల నెల్ల ♦ సతతంబు సాఁకెడు
మానవుఁ డింటనే ♦ మానితుఁడగు
నవసర వేళల ♦ నప్పుల నొసఁగెఁడు
ధనవంతుఁ డూరనే ♦ ఘనతఁ జెందుఁ
బ్రజల బిడ్డల వోలెఁ ♦ బాలన జేసెడు
ప్రభువు రాజ్యముననే ♦ ప్రణుతు లొందు
నిఖిల శాస్త్రంబులు ♦ నేర్పుమై జదివెడు
విద్వాంసుఁ డెల్లెడ ♦ వినుతి కెక్కుఁ
గీ॥ గాన మానవుఁ డనిశంబు ♦ గడలనందు
యశముఁ గూర్చెడు సద్విద్య ♦ లంద వలయు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 60

సీ॥ సద్గుణ కలితయై ♦ చరియించు బాలిక,
మాన నీయంబగు ♦ మంజు వాక్య,
మమల శుచిత్వంబు, ♦ నాగమ ధర్మంబు,
వివిధ శిల్పకలా ప్ర ♦ వీణతయును,
ననుపమ తేజ స ♦ మన్విత రత్నంబు,
నిఖిలేశ! నిన్గాంచు ♦ నాత్మ నిద్య
లివి వొట్టిజాతి వి ♦ హీనుల దరినున్నఁ
బలుపాట్లు వడియైనఁ ♦ బడయ వలయు
గీ॥ ముండ్లలోనున్న నటుఁ ♦ గ్రూర భుజగమున్నఁ
గూర్మిఁ గేత కిసుమమునుఁ ♦ గోయురీతి
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 61

సీ॥ కారంబులేని శా ♦ కంబుఁ బరుల కుప
కార హీనుండునై ♦ క్రాలు నరుఁడు
ఓంకార హీనమై ♦ యొప్పారు సన్మంత్ర
మధికార హీనమై ♦ నట్టి ప్రతిన
వాక్చతురతలేని ♦ వార కామిని సౌరు
లెక్కింప లేనట్టి ♦ లేఖరియును
సర్వేశ! నిను నుతి ♦ సలుపని పాండితి
సత్పాత్ర హీనుఁడౌ ♦ జనుని బ్రదుకు
గీ॥ వ్యర్థ మగుఁగాని నుతి పాత్ర ♦ మగునె? యభవ!
అంగ జోన్మదభంగ! ఖ ♦ ట్వాంగ! లింగ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 62

సీ॥ స్త్రీ సంగమంబుచేఁ ♦ జెడు నట్టి యతియైన
లాలనచేఁ జెడు ♦ బాలకుండు
మంత్రి దుర్మతియైన ♦ మహినాయకుఁడు చెడు
జెడు ననాధ్యాయియౌ ♦ పుడమి సురుఁడు
చెనఁటియౌ సుతుఁడున్నఁ ♦ జెడు నన్వయంబెల్ల
మద్యపానంబున ♦ మానము చెడు
శీలంబు చెడును దు ♦ శ్శీలుఁడౌ హితుఁడున్న
నల్పకున్న వ్యవ ♦ సాయము చెడు
గీ॥ ఖలుని సేవించి నందున ♦ ఘనుఁడు చెడును
దాన మొనరింప కుండిన ♦ ధనము చెడును
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 63

సీ॥ పితార్జితంబున ♦ పెట్టెలలో మూల్గు
విత్తంబు స్వేచ్ఛమై ♦ వెచ్చపెట్టు
సాహసు నెట్టుల ♦ సామర్థ్యఁ డనవచ్చు
నాగర్భ దారిద్ర్యఁ ♦ డై జనించి
పిలిచిన నోయసి ♦ పలికెడి గతిలేకఁ
గుడువఁ గూడునుఁగట్ట ♦ గుడ్డలేక
బహువిధ బాధలఁ ♦ బడుచును ధర్మంబు
దప్పక దాతయై ♦ తనరు నతని
గీ॥ చాట వచ్చును స్సామర్థ్య ♦ సాహసముల
మేటి యంచును వేమార్లు ♦ మెచ్చవచ్చు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ!        64

సీ॥ వలి గాడ్పుచే మేను ♦ వడకెడు తఱినైన
నుదయ మెండను "గాగు ♦ టొప్పితంబె?
కాటిలోఁ బీనుఁగ ♦ కాలుచుండెడి పొగ
యొడలిపైఁ బ్రవహించు ♦ టుచిత మగునె?
లేనకన్నఁ బెద్దదా ♦ తరుణితోఁ గ్రీడింప
పశు వర్తనునకైనఁ ♦ భావ్యమగునె?
ముఱికి నీటిని పాన ♦ మునుఁజేయ ఘనమానె?
దధ్యన్నమునుఁ దినఁ ♦ దగునె? రేయి
గీ॥ కాని కృత్యంబు లివిగాన ♦ మానవలయు
మానకుండిన నాయువు ♦ క్షీణమగును
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ!        65

సీ॥ అత్యంత భారమహా ♦ యవనీతలం బొక
శేషుండు శిరమునఁ ♦ జేర్చియుండ
నాభోగికుల నాథు ♦ నవలీలగా నొక
కమఠంబు వెన్నునఁ ♦ గదలకుంచెఁ
నా కచ్ఛపంబును ♦ నతి సూక్ష్మముగ నొక
క్రోడంబు మునిపంటఁ ♦ గూర్మినుంచె
నా వరాహంబును ♦ నణు మాత్రముగ నెంచి
జలధి మోయుచు నుండెఁ ♦ గలత లేక
గీ॥ యోగ్యులగు ధీరులొరులకు ♦ నోపినంత
సాయ మొనరింతు రది వారి ♦ సహజ గుణము
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 66

సీ॥ పతి పదాంబు జసేవఁ ♦ బనిగొని సల్పుచు
గుణవతియగు సతి ♦ కౌతుక మందు
శ్రాద్ధభోక్తగఁ బిల్వఁ ♦ జనితిని త్రేన్చుచు
సామాన్య విప్రుండు ♦ సంతసించు
పచ్చిపూరెట నున్న ♦ నిచ్చమై మేయుచుఁ
బసరంబు సంతోష ♦ భరితయగును
హితులగు వారలఁ ♦ జతవిడఁ దీయుచుఁ
పామరుండా నంద ♦ వార్ధిఁ దేలు
గీ॥ నఖిల సౌఖ్యంబు లెదరోసి ♦ యహరహంబు
నాత్మనిగ్గాంచుచుండుదు ♦ రమల మతులు,
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 67

సీ॥ దాతృత్వ గుణమున్న ♦ ధనము గుండ్రని సున్న
ధనమున్న వితరణ ♦ గుణము సున్న
విద్యాధికుండైన ♦ వినయ శూన్యపుటెద్దు
వినయాధికుండైన ♦ విద్య రద్దు
వైభవాన్వితుఁడైన ♦ వర తనూజులు స్వస్తి
పుత్రాధికుండైన ♦ భుక్తి నాస్తి
గుణవంతుఁడై యున్నఁ ♦ గులమున నీచుండు
కులవంతుఁడైన ♦ దుర్గుణ యుతుండు
గీ॥ గాఁగ నిర్మించి ప్రజలఁ జే ♦ కాకుఁ బఱచి
సంతసించెదు నీమది ♦ సాధు హృదయ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 68

సీ॥ గురునైనఁ దన బంధు ♦ వరునైన వంచించి
యార్జించు ధనము ధ ♦ నాతురుండు
పచనంబు గాకున్న ♦ రుచిలేక యుండు నే
దైన భుజించు క్షు ♦ ధాతురుండు
సౌఖ్యంబు లేకున్న ♦ సతము నిద్దుర సున్న
యైనఁదా చదువు వి ♦ ద్యాతురుండు
పరు లెఱింగిన నాన ♦ పతిగన భయమైన
ముగుదను గూడు కా ♦ ముకుఁడు నల్లె
గీ॥ భాములకు నోర్చి నిశ్చల ♦ భక్తిఁ గలిగి
పట్టు విడకున్న నిన్నుఁ జే ♦ పట్టు టెంత
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 69

సీ॥ ఎట్టుగాఁ గాలిన ♦ యినుముపైఁ బడి నీరు
చలచల గ్రాగితా ♦ సమసి తీరు
నా నీరమే తామ ♦ రాకుపైఁ జేరినఁ
దళతళలాడు ము ♦ త్యంబు లీల
నానీరమే స్వాతి ♦ యందున వానయై
శుక్తిలోఁ బడ శ్రేష్ఠ ♦ మౌక్తికమగు
నానీరమే జీవ ♦ నాధారమై సస్య
పశ్వాదులకు నెల్లఁ ♦ బ్రాణమగును
గీ॥ నీర మొక్కటైన నిలవులు ♦ వేఱుగుట
గుణము లీరితి మాఱును ♦ గుధర నిలయ?
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 70

సీ॥ దాసి చేసిన తప్పు ♦ దండ నార్హంబైనఁ
దల గొరిగించుట ♦ తగిన శిక్ష
పండిత వరుఁదప్పు ♦ దండ నార్హంబైన
గౌరవం బిడకుంట ♦ కఠిన శిక్ష
దార జేసిన తప్పు ♦ దండనార్హంబైన
దరిఁ బండ నీకుంట ♦ దండి శిక్ష
తన స్నేహితుని తప్పు ♦ దండ నార్హంబైన
మాటాడ కుంట ♦ మహిత శిక్ష
గీ॥ మాన ధనులకు నివియెంచ ♦ మరణ సమము
నీచ జనులకు నివెగడ్డి ♦ పోచలగును
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 56

సీ॥ "కూ్రిర కర్మిని దరిఁ ♦ జేరి సేవించుట
ఖర వాహనము నెక్కి ♦ తిరుగుచుంట
కారణం బదిలేక ♦ కేరుచు నవ్వుట
నిన్నతింగెడి విద్య ♦ నేర్వకుంట
సిగ్గెఱుంగక పేలు ♦ చెడిపెతోఁ బోరుట
బాలురతో స్నేహ ♦ భావముంట
యను నాఱు గుణములీ ♦ యవని సత్పురుషుల
కవమాన మొదగూర్చు"♦నంద్రు బుధులు

గీ॥ గాన నెన్నఁడు నరుఁడవ ♦ మాన మిడెడి
పనుల మెలఁగక యున్నచో ♦ ఘనము గాదె!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 72

సీ॥ సాహస గాంభీర్య ♦ సత్య సౌశీల్యాది
గుణయుతుఁడగు నొక్క ♦ కొడుకె చాలు
కపట చోర ద్యూత ♦ కామ మోహాది దు
ర్గుణ యుతులగు పెక్కు ♦ కొమరు లేల
యఖిల జీవంబుల ♦ కాహ్లాదమును గూర్చు
పూర్ణ చంద్రుఁడు నింగిఁ ♦ బొడమఁజాలు
లెక్కింప నలవిగా ♦ కెక్కువై ♦ పొడ సూపు
చుక్క లెన్నున్నను ♦ మక్కువగునె

గీ॥ వేలుపుల పెద్ద మొదలగు ♦ విబుధు లెంద
రున్న ఫలమేమి ప్రభుఁడ! నీ ♦ వున్నఁ జాలు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 73

సీ॥ కామినీ మణి గర్భ ♦ గతమగు సద్వీర్య
మండమై యభివృద్ధి ♦ నంది వేగ
చైతన్యమును నొంది ♦ జవసత్వ జీవముల్
గలిగి కర్ణంబులుఁ ♦ గనులు, నాసి
కంబును, నరమస్త ♦ కంబును, నుదరముల్,
హస్త పాదా ద్యవ ♦ యవములమరి
మాతృ గర్భము నుండి ♦ మహిని జన్మించియు
బాల్య యౌవన జరా ♦ భరిత వేష
గీ॥ ములను జరియించు నిది విరా ♦ ణ్మూర్తి! నీదు
మహిమచేఁ గాదె! విశ్వేశ! ♦ మదన నాశ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 74

సీ॥ పురుషవరేణ్య! ని ♦ న్న్యాజింతు నేప్రొద్దుఁ
బురుషార్థములఁ గూర్చి ♦ ప్రోవు మంచు
భక్తవత్సల! నిన్ను ♦ భజియింతు నేప్రొద్దుఁ
గామితార్థములిచ్చి ♦ కావు మంచు
యక్షరాడ్మిత! నిన్ను ♦ నర్చింతు నేప్రొద్దుఁ
దోడు నీడగఁ గూడి ♦ యేడు మంచుఁ
బతిత పావన! నిన్ను ♦ బ్రార్థింతు నేప్రొద్దు
మత్కృత దురితము ♦ ల్మాపుమంచు
గీ॥ శాశ్వ తానంద దాయివై ♦ సాఁకు మంచు
మునిజనావన! తలఁతు నే ♦ ప్రొద్దు నిన్ను
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 75

సీ॥ బ్రాహ్మణ జాతిని ♦ బ్రభవింపఁగ ఘనుండె?
సద్ధర్మ నిరతుఁడో ♦ జనుఁడు గాని
క్షత్రి యాన్వయమున ♦ జనియింప శూరుండె?
యరిమద దళితుఁడో ♦ నతఁడు గాని
వైశ్య కులజుఁడయి ♦ వర్ధిల్ల ధనికుండె?
వాణిజ్య చతురుఁడో ♦ వాఁడు గాని
శూద్ర వంశజుఁడయి ♦ శోభిల్లఁ గృషికుండె?
వ్యవసాయ నిపుణుఁడో ♦ వాఁడు గాని
గీ॥ తక్కుఁగల వారలందరు ♦ మెక్కుటిందె
పెద్ద లగుదురు గుణముల ♦ మొద్దు లగుచు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 76

సీ॥ తలి దండ్రులును నన్న ♦ దమ్ములు సతి సుతుల్
దన ముఖ్య బంధులై ♦ తనరు వార
లందరుఁ బ్రీతితో ♦ నుందురు ♦ కష్టించి
ధనము సంపాదించు ♦ తరుణమందు
నొడలిలో బలమిల్ల ♦ నుడిగి ఖిన్నుండునై
కాసుకుఁ గొఱగాని ♦ కాలమందు
మన్నింప రెవ్వరా ♦ మనుజునిఁ ♦ గనులారఁ
గనుగొన రొకవేళఁ ♦ గంటిరేని
గీ॥ హేయముగఁ జూతు రాతని ♦ హీనుఁ డనియు?
కాదు, దనమది లేకున్న ♦ కారణమున
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 77

సీ॥ బహువిధ రోగము ♦ ల్వ్యాపింపించి హీనత
పాలైన వాఁడు చు ♦ ట్టాల గుణము
శక్తి నుంతయు లేక ♦ సంసారము భరింపఁ
జాలని తరిఁ దన ♦ చాన గుణము
పటుతర కష్టాబ్ధిఁ ♦ బడి మున్గఁగా నున్న
సమయంబునన్ప్రాణ ♦ సఖుని గుణము
అసలు వడ్డీ టోట ♦ లైన మొత్తమును ని
దానించు నెడ ఋణ ♦ దాత గుణము
గీ॥ తెల్లఁ దెలియును బ్రస్తుత ♦ ముల్ల సిలుట
తగదు తానెంత వాఁడైన ♦ ధరణిలోన
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 78

సీ॥ కోప మత్తముని హ్ర ♦ త్కోశంబుఁ జేరదు
చేరెనా? నిమిషంబు ♦ మీరకుండు
మధ్యము పూరుషు ♦ మానసంబునఁ దరి
గాంచి కోపమురెండు ♦ ఘటిక లుండు
నొక పవలొక నిశి ♦ నొగి తీవ్రముగఁ గోప
మధముని మాన సం ♦ బందు నుండు
నా కోపమే మృత్యు ♦ వై యెడఁ బాయక
దురితునిఁ గబళించుఁ ♦ వఱకు నుండుఁ
గీ॥ గాన "గోపంబు పీడులే ♦ ఘనమ" టంచు
నీతి శాస్త్రజ్ఞు లందురు ♦ నిక్క మిదియు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 79

సీ॥ "శక్తి విహీనులై ♦ జరచేతఁ బీడింపఁ
　　బడు వృద్ధులను సాఁక ♦ వలయు విధిగ
శైశవ స్థితియుండె ♦ సద్గుణంబుల బోధ
　　పఱచఁగా వలయును ♦ బాలురకును
కార్య సాధన కొఱ ♦ కై బుద్ధి వంతుల
　　సలహాను గైకొన ♦ వలయు నెపుడు
"నతులిత సంపద ♦ లబ్బగా నున్నను
　　దురిత చరితు దరి ♦ కరుగుచుండ
గీ॥ రా" దనెడి నీతులను "మర్వ ♦ రాద" టంచుఁ
బల్కు చుందురు ప్రాజ్ఞులు ♦ పరమ పురుష
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ!　　80

సీ॥ ధనముఁ గూర్చుచునుండుఁ ♦ దాను భుజింపక
　　బీదల కొసఁగక ♦ పిసిని గొట్టు
స్వార్థాభి లాషియై ♦ సతముఁదాఁ గొనుఁ గాని
　　పరులకు నీయఁడు ♦ పరమ లోభి
తాను భుజించెడు ♦ తరి నొరులకుఁ గూడఁ
　　దప్పకఁ గూర్చును ♦ దాన గుణుఁడు
తా మాని యితరులఁ ♦ దనియించి శేషమే
　　తాఁ గొని తనివొందు ♦ దాత యెపుడు
గీ॥ దాత కాకున్న మానెను ♦ దార గుణము
గలిగి మనుజుండు వర్తింప ♦ ఘనుల మతము
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ!　　81

సీ॥ "వైరియై వర్తించు ♦ వాని సేవించుట
పగతుని హితు నెడ ♦ బాయకుంట
కల్ల లాడుచునుండు ♦ కలుషునిఁ జేరుట
పర సతి నెదనమ్మి ♦ మురియు చుంట
చోర శిఖామణిఁ ♦ జేరి చరించుట
జార వర్తనుసితో ♦ జత కుదురుట
జూద మాడెడు వాని ♦ నాదరించుచు నుంట
కల్లాను వానితోఁ ♦ గలసి యుంట
గీ॥ మొదలు గాఁగల చెయ్వలు ♦ మోసగించి
తీరు" నని చెప్పుచుందురు ♦ సూరి జనులు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 82

సీ॥ సద్ధర్మముల నెల్లఁ ♦ జయ్యన నెఱిఁగించి
బుద్ధి మాంద్యత నెల్లఁ ♦ బోవ నణచి
యనృత దోషంబునుఁ ♦ నంట నీయకచేసి
గౌరవ గుణముల ♦ ఘనునిఁ జేసి
పాపాటవులనెల్ల ♦ భస్మంబుఁ గావించి
దశ దిశా వ్యాప్తమౌ ♦ యశముఁగూర్చి
తన మనో వాక్కుల ♦ ధన్యునిఁ గావించి
కంటి రెప్పఁ బగిదిఁ ♦ గాచి సతము
గీ॥ సాఁకు చుండును దనహితు ♦ సజ్జనుండు
గాన సన్మిత్రుఁ బడయఁగాఁ ♦ గడఁగ వలయు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 83

సీ॥ సజ్జనుఁడగు వాని ♦ సహవాస బలమున్న
సకల కార్యంబులు ♦ సాధ్య మగును
నాస్నేహ మనిశము ♦ నభిలషించెదు జనుఁ
డతనితో వాగ్వాద ♦ మాడఁ జనదు
ధన మిచ్చుటయుఁ బుచ్చు ♦ కొనుటయుఁ గూడదు
హితుఁ డింట నేసప్పు ♦ డిల్లుఁ జేరఁ
దగ దెంత ముఖ్య స ♦ త్కార్యంబునకు నైన
బలుక రాదాతని ♦ భార్యతోడ
గీ॥ నిన్ని రీతుల జాగ్రత ♦ నున్న స్నేహ
మెందు లేకున్న నానేస్త ♦ మూడఁ బోదు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 84

సీ॥ "యౌవనంబు, ధనంబు, నధికార మవివేక"
మను నిందు నొక్కటి ♦ మనుజుఁజెఱచుఁ
నివి నాల్గు నొక్కట ♦ యెవ్వనిఁ జేరినఁ
గలు ద్రాపి తిక్క పెక్కి ♦ కక్క నున్న
కోతిని దేలుగట్టి ♦ కుయ్యోడ దయ్యంబు
పట్టనా వానర ♦ మెట్టి పిచ్చి
చేష్ట లొనర్చునో ♦ చెప్పలే మట్టులే
మితిమీఱి పిచ్చెత్తి ♦ వెతలఁ గుందు
గీ॥ నట్టి వారల ననుదిన ♦ మాశ్రయించు
వారి నాయంటు దోషంబు ♦ చేరి తీరు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 85

సీ॥ కుల హీనుఁడైన స ♦ త్కుల వంతుఁగాఁ జేయుఁ
బూర్ణ శుంఠను సభా ♦ పూజ్యుఁ జేయు
రూప హీనుస్సుర ♦ రూపవంతునిఁ జేయు
గుణ హీనుఁడైన స ♦ ద్గుణునిఁ జేయుఁ
బలుక నేరనివానిఁ ♦ బండితుఁగాఁ జేయుఁ
బారుఁ బోతును మేరు ♦ ధీరుఁ జేయుఁ
బామరుఁ డైనను ♦ బ్రతిభ వంతునిఁ జేయుఁ
గవ్వ సేయని వాని ♦ ఘనునిఁ జేయుఁ
గీ॥ నట్టి ధనమును మానవుఁ ♦ డెట్టు లైన
నార్జనము సేయు టొప్పగు ♦ నవనియందు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 86

సీ॥ ధనముండి సత్పాత్రి ♦ దానంబు సలుపక
చచ్చి దరిద్రుఁడై ♦ జనన మొందు
నా దరిద్రంబున ♦ నాలి బిడ్డలఁ బెంచఁ
జాలక యఘములఁ ♦ జాలఁ జేయు
నాపాపముల నెల్ల ♦ ననుభవింపఁగ ఘోర
నరకంబులంబడి ♦ పొరలు చుండు
మఱల దరిద్రుఁడై ♦ ధరణీ స్థలింబుట్టి
యెన్నియో కలుషంబు ♦ లెలమిఁ జేయు
గీ॥ నుండి దానంబు సలుపని ♦ మొండివాని
కిట్టి దుర్గతి గాక నిం ♦ కెట్టి గతియ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 87

సీ॥ గతభవ దుష్కర్మ ♦ తతి నిగూఢంబగు
వృక్షమై సత మభి ♦ వృద్ధి నొందు
చుండి ఫలంబుల ♦ మెండుగాఁ బండుచు
భోజ్యమైయుండ నా ♦ బుద్ధి యందు
లగ్నమై సుగుణముల్ ♦ భగ్నంబుగాఁ జేసి
యాశమై తత్కర్మ ♦ పాశ బద్ధ
మగుచుఁ దత్ఫలముల ♦ ననుభవింపఁగఁ జేయు
చున్నదందున నేర ♦ లెన్నరాని
గీ॥ బాధ లొనగూర్చు నా పాప ♦ పాదపమును
వేగఁ ద్రుంచుము దయతోడ ♦ వేదవేద్య!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిగత మీశ! 88

సీ॥ "పుడమిని మనుజులై ♦ పొడమిన వారెల్ల
రతి కుతుకంబున ♦ నాచరించు
పాప జాలంబుల ♦ భస్మంబుగాఁ జేయఁ
జాలును నీనామ ♦ స్మరణ" యనుచు
బెద్దలు వల్కఁగా ♦ విని నిన్నుఁ దలచని
నర జన్మకన్న నీ ♦ ధరణియందు
"బాప పుణ్యములేని ♦ పశువుగా నాలుగు
కాళ్లతో జనియించఁ ♦ గలిగెనేని
గీ॥ సరస" మందురు విబుధులు ♦ సరస హృదయ!
తాపసార్చిత మృదు పద! ♦ ధర్మచరిత!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 89

సీ॥ సత్పాత్రి దానంబు ♦ సల్పి యోగ్యుండనై
మనుటకు నావద్ద ♦ ధనము లేదు
కాల్నడ కలనైనఁ ♦ గాశ్యాది యాత్రలఁ
గలయఁ ద్రిమ్మరఁ ♦ గాళ్ల బలము లేదు
స్నాన సంధ్యా ద్యను ♦ ష్టానము లనిశంబు
సలుప నాయొడలిలో ♦ శక్తి లేదు
హృత్పద్మమందు ని ♦ ర్నిద్రి నిన్సతము ధ్యా
నింప నామది గురి ♦ నిలువఁ బోదు
గీ॥ అన్ని విధముల హీనత ♦ నందియున్న
నన్నుఁ బ్రోచుట ఘనమగు ♦ నంది వాహ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 90

సీ॥ కరుణఁ జూడ వదేర? ♦ కరిముఖాసుర హర!
భావజ మదనాశ! ♦ భవ వినాశ!
దయఁ జూడ వేమిరా? ♦ తాపస మందార!
నిగమాంత సంచార! ♦ నిర్వికార!
పాలించ వేమిరా? ♦ పరశివ! పురహర!
అఖిల లోకాధీశ! ♦ యభ్రికేశ!
రక్షింప వేమిరా? ♦ రాజార్ధ కోటీర!
నాగేంద్ర కేయూర! ♦ నగ విహార!
గీ॥ ఏర! ననుఁబ్రోవ విది నీకు ♦ మేర యటర?
వాసవార్చిత మృదుపాద ♦ వనజ యుగళ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 91

(నిత్య, మానసార్చన విధాన, 'షద్యాష్టకము.)

సీ॥ శ్రీమన్మహేశ! యా ♦ శ్రితజన పరితోష!
యానందముగను ని ♦ న్నను దినంబు
హృత్పద్మమున నిల్పి ♦ యెంతేని భక్తిగో
రాజోప చారాది ♦ పూజల నొగి
సంతుష్టిగాఁ జేసి ♦ సంస్తుతించెదనయ్య!
పతిత పావన! నాదు ♦ పాపజాల
మతి శీఘ్రముగఁ దోలి ♦ యాదరింపుము శూలి!
నంది వాహన! శర్వ! ♦ నాగభూష!
గీ॥ నీరజాసన వందిత! ♦ నిగమ వినుత!
యఖిల జనగేయ! పరమాత్మ! ♦ యప్రమేయ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 92

సీ॥ శ్రీకర! గిరిజాత ♦ చిత్తాబ్జ సంచార!
ధ్యానింతు నిన్నుఁ: వే ♦ దాంత వేద్య!
వనజాప్త, వనజారి, ♦ వనజాత లోచన!
యావాహనము సేతు ♦ నభ్రకేశ!
భువన జనాధార! ♦ భోగీంద్ర కేయూర!
కొనుమర్ఘ్య పాద్యముల్ ♦ కుధర నిలయ
పాపాట వీదాహ! ♦ పశుపతీ! నిర్మోహ!
కనకాసనం బిత్తుఁ ♦ గరుణఁ గొనుము
గీ॥ ఆచమానంబు నిడుదు ♦ శుద్ధాంబువులను
నత జనోల్లాస! కైలాస ♦ నగవిహార!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 93

సీ॥ పరిమళ యుతమగు ♦ పన్నీట నిన్ను నే
స్నానంబుఁ జేయింతు ♦ సదయ హృదయ
సన్న పుట్టముచేత ♦ పెన్నెఱుల్ మేనును
దుడిచెదఁ దడియార ♦ నుడుప చూ(డ!
శ్వేతకా శేయముల్ ♦ చేతో ముదంబున
ధరియింపఁ జేసెద ♦ ధవళ వర్ణ!
అనుపమతేజ స ♦ మన్విత యజ్ఞోప
వీతంబు నిడెద సం ♦ ప్రీతి నభవ!
గీ॥ చంద నాక్షత లివె శీర్ష ♦ మందు నునిచి
రత్న పాదుక లొసఁగెద ♦ రమ్య చరిత
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 94

సీ॥ పరివిమల జలముతో ♦ భస్మంబుఁ జేర్చి నీ
మేనెల్ల నలదెద ♦ మృత్యు హరణ!
పునుగు జవ్వాదుల ♦ నునిచి శ్రీ గంధంబు
రహిని బొట్టుంతుఁ బు ♦ రాణ పురుష!
వరరత్న రచిత సా ♦ వర్ణ కోటీరాది
వస్తువు లిడెదఁ బ్రి ♦ శస్త మూర్తి!
ఘుమఘుమ వాసించు ♦ సుమముల మాలగా
రచియించి యర్పింతు ♦ రమ్యగాత్ర!
గీ॥ కళల నీనెడు నవరత్న ♦ ఖచిత భర్మ
యుక్త దర్పణమిత్తు ♦ మహోక్ష తురగ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 95

సీ॥ ముద మొదవెడు మంచి ♦ ముత్తెముల్ వేలెడి
ఛత్రింబుఁ బట్టెద ♦ సాంబమూర్తి!
వీవఁగాఁ గమ్మని ♦ తావుల నీనెడి
పూవీవ నలవీతు ♦ భోగి వలయ!
ముట్ట ఖణేలని ♦ మోగుచుండెడి జయ
గంట వాయింతును ♦ గగన కేశ!
పూరింప భూ నభో ♦ భువనముల్ బెగడొందు
శంఖంబు నూదెదఁ ♦ జంద్ర మౌళి!
గీ॥ తట్టినంతనె జనములఁ ♦ దల్ల డిల్లఁ
జేయు భేరిని మోగింతుఁ ♦ జిద్విలాస!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 96

సీ॥ సిత వారిజాతముల్ ♦, చేమంతి, మందార,
పున్నాగ, విర జాజి ♦, బొండు మల్లె,
కల్హార, చెంగల్వ, ♦ కరవీర, మాలతీ,
పారి జాతాది పు ♦ ష్పములు; బిల్వ,
మరువము, దమనము, ♦ మాచి పత్రియు, శమీ
పల్లవంబులు, మఱి ♦ భర్మ రచిత
వివిధ సుమంబుల ♦ వెసఁ గూర్చి సద్భక్తి
నర్పింతు ముదముతో ♦ నభవ! కొనుము
గీ॥ అంగ జోన్మద భంగ! ద ♦ శాంగ ధూప
మిచ్చుచున్నాఁడ నందుమీ ♦ సచ్చరిత్ర!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీల కంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 97

సీ॥ అఖిల జగత్త్రి మీ ♦ రాపహంబగు ఘృత,
జ్యోతి త్రయంబిదె ♦ ప్రీతిఁ గొనుము
ద్రాక్ష, ఖర్జూరముల్ ♦, తగనారి కేళముల్,
మధు, శర్కరం జేర్చి ♦ మహితమైన
యవసర నైవేద్య ♦ మర్పింతు భుజియింపు
మిదియె రత్నాంచిత ♦ హేమ పాత్ర
మందుంచినాను శా ♦ ల్యాన్నంబు, వివిధోప
భోజ్యముల్ గుడువు మీ ♦ బొజ్జనిండ
గీ॥ నాచమానంబు నిడెద శు ♦ ద్ధాంబువులను
వాయియుఁ, జేయి, పాదముల్ ♦ బాగు పఱతు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 98

సీ॥ ఇదిగో నర్పింతు ను ♦ మేశ! నే నానంద
నీరాజనముఁ గొను ♦ నిండు వేడ్క
తాంబూల వర చర్వ ♦ ణం బొనరింపుమీ!
యిడెద సంప్రీతితో ♦ నిందు మౌళి!
సాష్టాంగ దండముల్ ♦ సల్పెద నందుమీ!
మంత్ర పుష్పంబిదె ♦ మార నాశ!
మంత్ర తంత్ర క్రియా ♦ మహిత సద్భక్తులు
కొఱ వడినను మదిఁ ♦ గోప పడక
గీ॥ యభవ! పరమేశ! జగదీశ! ! యభ్రకేశ!
వాస వార్చిత నుతపద! ♦ భక్త వరద!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 99

సీ॥ స్వస్తి శ్రీ ధాతృ సం ♦ వత్సర వైశాఖ
శుద్ధ మందిన తిథిని ♦ సూర్య వార
మునగూడి ఘటికలు ♦ పదమూడు నిఱువది
విఘటి కల్గించని ♦ వేళయందు
హస్తార్క షష్ఠిమ పా ♦ దాన్విత కర్కాట
కాఖ్య లగ్నంబున ♦ నతుల భక్తి
యుక్తుండనై ♦ షోడ ♦ శోప చారంబుల
నర్పించి మత్కృతం ♦ బైన సీస
గీ॥ శతక మర్పణం జేసితి ♦ స్వాంత మలర
స్వీకరింపుము సర్వేశ! ♦ చిత్ప్రకాశ!
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 100

సీ॥ శ్రీదసు హృద! సాంబ! ♦ శివ! సర్వ మంగళా
సంగ! భర్గా! శుభ ♦ మంగళంబు
శంభూ! పరాత్పర! ♦ శంకర గంగోత్త
మాంగ! శూలీ! జయ ♦ మంగళంబు
లింగ! మహేశ! శు ♦ భాంగ! కరధృతకు
రంగ! శర్వా! నిత్య ♦ మంగళంబు
వరద! విశ్వాధిప! ♦ పురహర! జలధి ని
షంగ! హరా! భవ్య ♦ మంగళంబు
గీ॥ మారమదనాశ! సర్వేశ! ♦ మంగళంబు
మంగళాకార! కొను మిదే ♦ మంగళంబు
దగ్గులూరి నివేశ! పా ♦ తక వినాశ!
నీలకంఠేశ! నన్నేలు ♦ నిరత మీశ! 101

—గద్య—

ఇది శ్రీమదుమారమణ పాదారవింద మకరంద పానేందిం
దిర, బాలా పరమేశ్వరీ కరుణా కటాక్ష వీక్షణ సమా
లబ్ధ సరసకవితా వైభవ, మన్మహా ఋషి గోత్ర
పవిత్ర, అశ్వలాయన సూత్ర, బళ్లవంశ పయః
పారావార రాకాకైరవ మిత్ర, కనక
యాభిధేయ, సత్పాత్ర, మల్లయ్యా
నామధేయ ప్రణీతంబగు
నీలకంఠేశ్వర శతకము
సర్వంబును
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ



# తప్పొప్పుల పట్టిక.



| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 1 | 6 | మన్మహేశ్వరా | మమ్మహేశ్వర? |
| 2 | 16 | కంజజోదరురాణి | కంజాసనురాణి |
| 5 | 3 | బంభరా | బంభర |
|  | 6 | దంతశూకాశన | దందశూకాశన |
|  | 7 | బర్హిణా | బర్హిణ |
|  | 9 | వజ్రిమా | వజ్రిమ |
| 10 | 8 | వందిత! కావ | వందిత ప్రోవ |
| 14 | 16 | వస్త్రార్థులకునున్న | వస్త్రార్థులకు వలయు |
|  | 18 | నార్థులకున్న | నార్థులుగోరు |
| 15 | 22 | నీతినను | నీరీతినను |
| 18 | 2 | ఆశ్రీతకల్ప | ఆశ్రితకల్ప |
| 19 | 5 | బొట్టెను | బుట్టెను |
| 25 | 14 | లరధచ | లరదచ |
| 26 | 5 | ఖట్వాంగ | శుభాంగ |
| 31 | 9 | తెల్లెడ | డెల్లెడ |
| 32 | 11 | ఖ ♦ ట్వాంగ | శు ♦ భ్రాంగ |
| 35 | 16 | యుండునే దైన | యుండిన దైన |
| 36 | 19 | దరిబండనీకుంట | దరిబండనియకుంట |
| 44 | 20 | ధరణీస్థలిం | ధరణీస్థలిం |